# తెలుగు వర్ణములు

- సంస్కృతమునకు వర్ణములేబది . (బా.వ్యా. సంజ్ఞా 1)
- ప్రాకృతమునకు వర్ణములు నలువది. (బా.వ్యా. సంజ్ఞా 2)
- తెలుగునకు వర్ణములు ముప్పదియాఱు. (బా.వ్యా. సంజ్ఞా 3)
- ఋ,ౠ,ఌ,ౡ,విసర్గ,ఖ,ఛ,ఠ,థ,ఫ,ఘ,ఝ,ఢ,ధ,భ,ఙ,ఞ,శ,ష లు సంస్కృత సమంబులంగూడి తెలుఁగున వ్యవహరింపఁబడు (బా.వ్యా. సంజ్ఞా 4)
- ఆంధ్రభాషకు వర్ణము లేబది యైఁదు. ( ప్రౌ.వ్యా. సంజ్ఞా 1)

# సంస్కృత వర్ణములు

1. సంస్కృతమునకు వర్ణము లేఁబది.

- అ ఆ; ఇ ఈ; ఉ ఊ; ఋ ౠ; ఌ, ౡ; ఏ ఐ; ఓ ఔ; అం అః.
  (అచ్చులు 16)
- క ఖ గ ఘ ఙ;చ ఛ జ ఝ ఞ;ట ఠ డ ఢ ణ;త థ ద ధ న;ప ఫ బ భ మ
  య ర ల వ ; శ ష స హ ళ. (హల్లులు 34)

ఇం దకారాదు లచ్చులు. కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మిలాగుననే మీఁద నెఱుంగునది.

www.Academy.TeluguThesis.com

# ప్రాకృత వర్ణములు

2. ప్రాకృతమునకు వర్ణములు నలువది.

- అ ఆ; ఇ ఈ; ఉ ఊ; ఏ ఓ; అం అః. (అచ్చులు 10)
- క ఖ గ ఘ; చ ఛ జ ఝ; ట ఠ డ ఢ ణ; త థ ద ధ న; ప ఫ బ భ మ;

య ర ల వ; స హ ళ. (హల్లులు 30)
కొందఱమతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు.
కొందఱమతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రము లని,
ఐ ఔ లు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురు.

# తెలుగు వర్ణములు

3. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు.

- అ ఆ; ఇ ఈ; ఉ ఊ; ఎ ఏ ఐ; ఒ ఓ ఔ; అం అః. (అచ్చులు 14)
- క గ; చ చే జ జే; ట డ ణ; త ద న; ప బ మ;

  య ర ల వ; స హ ళ. (హల్లులు 22)

# సంస్కృతసమ వర్ణములు

4. ఋ ౠ ఌ ౡ విసర్గ; ఖ ఛ ఠ థ ఫ; ఘ ఝ ఢ ధ భ; ఙ ఞ; శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁ బడు. (సంస్కృతసమవర్ణాలు 19)

ఋతువు,పితౄణము, క్లృప్తము, ఌకారము, దుఃఖము, ఖడ్గము, ఘటము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్క, రథము, ధరణి, ఫలము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము, షండము.

•

# తెలుగు వర్ణమాల - అచ్చులు

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | ఌ | ౡ | - | ఏ | ఐ | - | ఓ | ఔ | అం | అః | 16 |
| తె | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | - | - | - | - | ఎ | ఏ | ఐ | ఒ | ఓ | ఔ | అం | అఁ | 14 |
| ప్రా | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | - | - | - | - | - | ఏ | - | - | ఓ | - | అం | అః | 10 |

# హల్లులు 1 (క-ఞ)

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం | క | ఖ | గ | ఘ | ఙ | చ | - | ఛ | జ | - | ఝ | ఞ | 10 |
| తె | క | - | గ | - | - | చ | ౘ | - | జ | ౙ | - | - | 06 |
| ప్రా | క | ఖ | గ | ఘ | - | చ | - | ఛ | జ | - | ఝ | - | 08 |

# హల్లులు 2 (ట-మ)

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | 15 |
| తె | ట | - | డ | - | ణ | త | - | ద | - | న | ప | - | బ | - | మ | 09 |
| ప్రా | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | 15 |

# హల్లులు 3 (య-ళ)

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | 09 |
| తె | య | ర | ల | వ | - | - | స | హ | ళ | 07 |
| ప్రా | య | ర | ల | వ | - | - | స | హ | ళ | 07 |

| | అచ్చులు | క-ఞ | ట-మ | య-ళ | మొత్తం |
|---|---|---|---|---|---|
| సం | 16 | 10 | 15 | 09 | 50 |
| తె | 14 | 06 | 09 | 07 | 36 |
| ప్రా | 10 | 08 | 15 | 07 | 40 |

# తెలుగు వర్ణమాల



| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ౠ | ఌ | ౡ |
| ఎ | ఏ | ఐ | ఒ | ఓ | ఔ | అం | అః | | 18 |
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ౘ | ఛ | జ | ౙ |
| ఝ | ఞ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద |
| ధ | న | ప | ఫ | బ | భ | మ | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | 37 |
| | అఁ | ఱ | | 16:34 | 10:30 | 14:22 | - | | 55 |

www.Academy.TeluguThesis.com

# ఊహించండి..

- సంస్కృతంలో ఉండి –
  - ప్రాకృతంలో లేని వర్ణాలేవి?
  - తెలుగులో లేని వర్ణాలు ఏవి?
- తెలుగులో ఉండి – సంస్కృతంలో లేనివి, ప్రాకృతంలో లేని వర్ణాలు ఏవి?
- వర్ణమాలలో క్ష, ఱ, అఁ లను ఎందుకు పేర్కొనలేదు.
- సంస్కృత,ప్రాకృత, తెలుగు భాషల్లో అక్షరాలు ఎన్నెన్ని ఉన్నాయి.

